

# "అంబానం" అను అభయ వేదము

ఇది

దైవభక్తి, నరులపై ప్రేమ,

జంతువులయెడ దయను బోధించును.

పతితోద్ధారకుల నంజుండ అభయార్థిచే

వ్రాయబడినది

దీనిని చిత్తూరుజిల్లా వ్రాయల్పాడు శ్రీమాన్ చింతల రఘునాథరెడ్డివర్మగారికి భక్తితో అర్పించుచున్నాను.

౧౯–౨౧.

దయయే దేవుడు; దయగలహృదయమే
దేవాలయము; దయనెఱిగినవాడే భక్తుడు.

---

(౧) దైవభక్తి: (పితృ లేక మాతృభావము).

స్థావరజంగమ సృష్టికర్త పరమేశ్వరుడు అతడు సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు దయానిధియు. గోచర అగోచరములురెండు. దేహము, ఆత్మ. సకలదేశ, మత, భక్త, యోగి, సాధు, ఋషి, అనుభవమున నిరపాయపవిత్రప్రేమ యుతమగు ఈశ్వరుని గూర్చిన విషయముల గ్రహించి, శక్త్యానుసారమాచరించుటకు శ్రద్ధాభక్తినిగల్గియుండుట. సర్వసృష్టికర్త సకలప్రాణులకును ఆరోగ్యము

ను, ఆనందమును నొసగుటకై పితృభావము
న, లేక మాతృభావమున భక్తితో దండము
డుట. పంచేంద్రియములకు గోచరము గాక
అజ్ఞానమున జేయు హింసకై పశ్చాత్తాపపడి
క్షమింపుమని ఆ జగదంబయు కరుణానిధియు
జగత్పితయగు మహాదేవుని ప్రార్థించుట. క్ర
మముగా దయను వృద్ధిజేసికొని చరాచర
సృష్టిలో నీశ్వరుని దర్శించుట అభయము.

(౨) సకులపై ప్రేమ; (భ్రాతృభావము)

సకలదేశ, జాతి, వర్ణ, మత, వృత్తి, ఆ
చార, వేష, భావ, స్థితుల మానవులీశ్వరుని
బిడ్డలని నమ్మి భ్రాతృభావమునజూచుట. జ్ఞాన,
బల, సౌందర్య, ఉద్యోగ, సామర్థ్యము లీశ్వ
రుడు ప్రసాదించినవని నమ్మి గర్వించక అన్యో
న్యప్రేమతో బంధారుల కష్టములలో పాల్గొ

నుట. జననీజనకులను దేవతలనిభావించి, పూ
జించి సేవించుట. పెద్దలనుభక్తితో, సము
లను స్నేహముతో. చిన్నవారిని ఆదరణతో
జూచుట. ఒండొరుల తప్పులను ప్రేమతో ది
ద్దుటకు బాధ్యులైనను, సర్వమానవులు స్వ
తంత్రులే. ఎట్టివారికైనను దేహమనోబాధలొ
నర్చ అధికారము లేదు. ఈ అభయ మతావ
లంబుల నెవ్వరుహింసించినను ఓర్వవచ్చును;
బాధను తప్పించుకొనవచ్చును; తుదకు శాం
తముగా మృతినొందవచ్చునుగాని ప్రతిబాధ
జేయరాదు. దయగల హృదయమే దేవాల
యము. ఆహార, పానీయ, వస్త్రధారణ, ని
వాస, వృత్తులలో నితరప్రాణుల బాధలేక,
మనోవాక్కాయ కర్మల బవిత్రముగా జీవిం
చుట. పంచేంద్రియములను భయాభయే

మార్గము తెఱిగి ఎచ్చరికతో ఉపయోగించుట.
ఆస్తికుడనబడి హింసించుట నాస్తిక సూచక
ము. నాస్తికనామమున అహింసా వ్రతమూని
నచో ఆస్తికుడగు దయయే దేవుడు. అతని
నీశ్వరుడు విడువడు. పేరుకై పోరాడక, అ
మాయక, నిరపాయ, లోకోపకార సాధు
వృత్తి శాంతముగాను, దయగాను బూనుట,
ఈశ్వరపూజయై పవిత్రానంద మొసగును.
ఎంతఅల్పవస్తువునైనను అలక్ష్యముతోను,
అగౌరవమునను జూడకుండుట. ప్రాణుల న
క్కువ గౌరవ పవిత్ర ప్రేమదృష్టితో గనుట.
లోకదుఃఖమును తగ్గింప సదా ప్రేమతో
పాటుపడుట మోక్షమునకు సాధనము. ప్రా
ణము దేహమునుండి వేరగుటయు, దేహము
మన్నగుటయు, ప్రతిదినము దలచి, గర్వము

ను, కోపమును, ఆశనుమాటను, దేహారోగ్యము, మనోవికాసమునకై ఉపవసించుచు ధర్మిష్ఠుడును భక్తుడును అగుట. అసత్యము, చోరత్వము, వ్యభిచారము, చంపుట (మాంసభక్షణము), మద్యపానము, ఇవి పాపములు. సత్యము, దొంగిలించకుండుట, వ్యభిచరించకుండుట, చంపకుండుట, (మాంసము దినకుండుట) మద్యపానము చేయకుండుట, ఇవి పంచశీలములు. వీనిని ఆచరించుచు బోధించువాడు ఆచార్యుడు. వీనిలో నెన్ని ఆచరించిన నంతఎక్కువ పూజ్యత, ఆనందము గల్గును. చంపుటనుమాత్రము పాపమని, తక్కినవానిని అలక్ష్యపెట్టుటయు, చంపుటను పాపమనక తక్కిన నాల్గింటిని గమనించుటయు లోపమే. పంచశీలములను పవిత్రప్రేమ

తో బోధించి ఆచరించువారు దేవతలకు స
ములు. ఆచరించుటయు బోధించుటయు ఇ
రువురికిని లాభకరము. ఆచరించి బోధిం
కుండుట ఆచరించువారికే లాభము. ఆచరిం
చక బోధించుట వినువారికి మాత్రమే లాభ
ము. ఆచరించకయు బోధించకయు నుండుట
ఎవ్వరికిని లాభము లేదు.

(3) జంతువులయెడ దయ: (మిత్రభావము)

మూగపశు, పక్షి, మత్స్య, క్రిమి, కీటక,
సరీసృపాదులను మన స్వంతబిడ్డలవలె భా
వించి బాధ నివారించుట క్రూర, దుష్ట వ
న్యమృగములనుసహా మిత్రదృష్టితో జూచు
ట, మానవుల యపరాధము లోర్చుటకంటె,
మూగజంతువుల స్వాభావిక దౌర్బల్యమును
ఓర్చుట ఎక్కువ ఆవశ్యకము. వానిని మనవలె

పోషించి, వానినుండి శక్త్యానుసారము ఉప కారమును బొందుచు, మూగవగుటచే వానిని మానవులకంటె నెక్కువ ప్రేమించుట తప్ప, వానిని బాధించు హక్కు మనకు ఎంతమాత్రమును లేదు. మూగజంతువుల దుఃఖపెట్టుటచేత మానవులు పొందు సౌఖ్యము, లాభమును భయమైనది; పాపమైనది. అంతకంటె మనము శాంతముతో బాధలోర్చి వానిని రక్షించుటకై ప్రాణమును సంతోషముతో అర్పించుట శ్రేష్ఠము, అభయము, పుణ్యము. ఇదినిజమైన శౌర్యము, వైరాగ్యము, గౌరవము. మానవుల హింసబాపు విషయమై న్యాయమైనదానిని జంతువులయెడను అనుసరించుటధర్మము. మానవులహింసించుట భయము, పాపము మూగజంతువుల హింసిం

చుట అంతకంటె ఎక్కువ భయంకరము. మానవులను మరపున నొప్పించినను ఈశ్వరు డోర్వవచ్చును. మూగసాధుజంతువుల హింసవలన లోకము ప్రత్యక్ష నరకముగా మారును. పరమేశ్వరానుగ్రహము పొందుట దుర్లభము. ప్రాణమన్నిటికంటె శ్రేష్ఠము; పవిత్రము; అమూల్యము. ప్రాణదాత ఈశ్వరుడు. స్వాభావికముగా వార్ధక్యముచే జచ్చుట న్యాయము. మధ్యకాలమున రోగమున జచ్చుటకొంత దుఃఖకరము. బలవంతముగా ఏప్రాణి నైనన హింసించి జంపుట, క్రూరము, భయము, మైల, దుఃఖము, నీచము, అన్యాయము; అసహ్యము. వికారము, పాపము. సకలప్రాణులను మిత్రదృష్టితో జూచుట కభ్యసించుట అభయమార్గము. ఇదియే అభయమతము. చం

పుట పాపము; భయము. రక్షించుట పుణ్యము, అభయము. ఇదియే అభయ వేదము.

మనలను హింసించు మూగజంతువులను హింసించినచో మన ఆధిక్యమేమి? మనల జంపు జంతువుల జంపినచో వానికంటె క్రూర హీనకార్య మొనర్చినవారమై, వాని అంతస్తుకంటె క్రిందికి దిగుదుము. క్రిమికీటక సరీసృపాదులు మనకుకొంత బాధగల్గించినందులకై వాని నంతమొనర్చుటెంత భయంకరము? ఎంతగొప్పమరపు! ఈపైమూడంశములుగల అభయవేదమును సకలభ్రాతలు చదివి, చదివించి, ఆలోచించి, మంచిదని తోచినచో, అనుసరింపవచ్చునని, పతితోద్ధారకుల అభయమతార్థి నంజుండప్ప ప్రేమతో ప్రార్థించు

ను. భయమా! పొమ్ము, దయా! రమ్ము.
అభయా! అభయమునిమ్ము.

ఓం, శాంతిః, శాంతిః శాంతిః.

| | |
|---|---|
| "అభయకుటీరము" | దయావంతుల పాదసేవకుడు |
| హిందూపురము | ను, మూగజంతువుల మిత్రు |
| (అనంతపురముజిల్లా). | డును అగు, |
| సోమవారం-౧-౮-౨౧ | ప. న. అభయార్థి. |

---

బెజవాడ. వాణీ ముద్రాక్షరశాల, యందు
డి. కే. పంత్ చే
ముద్రింపబడియె. 1921.

